శ్రీ

# శ్రీకృష్ణగార్హస్థ్యము

ఆదర్శపురుషుడుగ సార్వత్రికప్రసిద్ధినందిన కృష్ణుని జారశిఖామణిగ జేర్చి ఏహ్యమగున అన్యదేశీయులు చిత్రించిరి. ఆ వ్రాతల నాధారపరచుకొని మన దేశీయపండితులుకూడ బాగుగ విమర్శింపకయే ఆకునుపోకను బొందని వ్రాతల వ్రాయజొచ్చిరి. "దురదృష్టవశమున మనము వినెడు వృత్తాంతమంతయు పురాణములయందే కన్పడుచున్నది. మరియు మన జీవితమునంతను మనయాత్మిక యాధ్యాత్మిక శారీరకాభివృద్ధి సంపదను మంటగలిపిన ఈ పురాణములే మనకథానాయకుడగు నామహాపురుషుని సత్ప్రవర్తనములను కళంకితముల గావించుటకు సైతము సంబంధపడియున్నవి. కావుననే వీనిసత్యమెంత వరకని కనుగొనుటకే చర్చ కవసరము కలిగినదని ఉత్తరమిచ్చుచున్నాను. ఈపురాణములలోని మూఢవిశ్వాసములను బాణములచే పవిత్రాత్ముడగు కృష్ణుడెంతగ గాయపరుపబడెనో యంతదౌర్జన్యముగ అంతక్రూరముగ ప్రపంచమందేమహాపురుషుడును హింసింపబడి యుండుటలేదు. పాపమీ గాయములవలన నీతని రూపమే మారిపోయెను. ఈ పురాణములయొక్క కృపావిశేషముచేతనే యార్యసంతానమందొక పెద్దభాగమువారు కృష్ణుని జారుడని చోరుడని అపవిత్రుడని

భావించుచున్నారు. ఆతనిచారిత్రమునం దయిష్టులగుచున్నారు. ఈ పురాణబోధనావిశేషముచేతనే ఆర్యసంతానులనేకులు విద్యాబుద్ధుల నేర్చియు క్రైస్తవులయొక్కయు మహమ్మదీయుల యొక్కయు వలలలో చిక్కుచున్నారు.........హిందూ జాతియం దన్నిమతములవారికిని ప్రముఖుడై పూజింపబడు చున్న మహాపురుషునిపట్ల నీలాటి యనౌచిత్యప్రసంగమును కమనోటినుండి వలికెడి యార్యసూనుని జూచినప్పుడెల్లను నాకు మిక్కిలి విచార మొదవుచుండును" కీ. శే. లాలాలజపతిరాయి గారి కృష్ణజీవితచరిత్రము.

జీవితముల వర్ణించినవి పురాణములు. పురాణముల యొక్క సంహితాభాగముల మన మెరుగము. విష్ణుపురాణము 3 వ ఖండము - 6 వ అధ్యాయము - 16 వ శ్లోకము మొదలు 19 వ శ్లోకమువరకు కలదిది. "పౌరాణికవిద్యయందు పూర్ణు డగువ్యాసుడు ఆఖ్యానోపాఖ్యానగాధాకల్పసిద్ధులుకల పురాణ సంహిత నొకదానిని రచించి తనసుప్రసిద్ధ శిష్యుడగు రోమ హర్షణున కిచ్చెను. రోమహర్షణునికి సోమతి, అగ్నివర్ణ, మిత్రాయు, వైశంపాయన, కృతశ్రవణ, సవర్ణులను నాల్గురు శిష్యులుండెడివారు. కశ్యప, సవర్ణ, వైశంపాయనులనువా రొక్కొక సంహితను వ్రాసిరి. వీరందఱకు రోమహర్షణ సంహితయే మూలము" అని—అగ్నిపురాణ మట్లే యనినది. భాగవతము దశమస్కంధము - మూడవ అధ్యాయములో. "వీరు మూలపురాణసంహితలను జదివి తామొక్కొక పురా

ణమును రచించిరి” అని క్రొందఱ పేర్ల నిచ్చెను. భాగవతము ద్వాదశస్కంధము సప్తమాధ్యాయములో “ప్రథమమున వ్యాసు డారుసంహితలను రచించెను—రోమహర్షణునికి నేర్పెను. ఆతనివలన ఆరుణి మొదలగువార లొక్కొక సంహితను నేర్చి వ్రాసిరి.” అని యున్నది. పై ఆరుగురిలో, ఈ ఆరుణి కాని పైన జెప్పబడిన కశ్యపుడు కాని లేరు. ఈ దృష్టాంతముల వలన వ్యాసుడను నాత డొక సంహితను రచింపగ శిష్యు లారుగురారు సంహితల రచించిరని తెలియుచున్నదికదా! ఈసంహితలే క్రమముగ బురాణములుగ బెరిగి వ్యాప్తినొందినవి. వీనిలో గృష్ణజీవితమును వర్ణించినవానిలో నేజూచి నంతకు మహాభారతము, బ్రాహ్మపురాణము. విష్ణుపురాణము, భాగవతము, పద్మపురాణము, బ్రహ్మవైవర్తము, మత్స్య పురాణము, కూర్మపురాణము, హరివంశము గర్గభాగవతములు ముఖ్యములు. అందానను విశేషముగ గృష్ణకథయే ప్రాముఖ్యముగ గొనినవి బ్రహ్మవైవర్త, విష్ణుపురాణ (హరివంశ ము లనవచ్చును. అయినను మొత్తముగ నన్నిటిని దడవుట ధర్మము. మున్ముందు మహాభారతమును జూతము. ప్రకృతము మన దృష్టినందుచున్న భారతేతిహాసము ప్రక్షిప్త సమన్వితమనుట నిర్వివాదము. పండిత లేఖారాంగారి హిందూ దేశచరిత్ర 292 వ పుటలో నీక్రింది విషయ ముల్లేఖితము. భోజవచనము “విక్రమార్కుని కాలమున నిరువది నాలుగు వేలుగనున్న భారతము నేడు ముప్పదివేల శ్లోకములతో

నున్నది. ఇంకను మున్ముందు లాట్టియలపై మోాయింపవలయు బరువుకల గ్రంథము కాగలదు. వ్యాసునిపేరుతో ప్రకటిత మగుచున్న మార్కండేయ పురాణకర్తల వెతకి పట్టి శిక్షించి తిని. ఈ కల్పితగ్రంథకారులు మునులపేరున మనదేశమును సత్యేతరమార్గముల జొప్పించి ధర్మశూన్యముగ జేయగలరు" అని. ఈ పొత్తము గ్వాలియర్ సంస్థానములోని భీండ్ గ్రామ నివాసి 'రివాడీ' యను బ్రాహ్మణుని వశమున నున్నదట.

మహాభారతమును గురించి భారతవాణీభూషణ ప్రమధ నాథమల్లిక్ F. R. S. A. గారిట్లు వ్రాసిరి. "The actual incidents with the intraduction of fictitious Characters to produce a dramatic effect on the audience. They eitner introduced new matter in the texts of the Mahabharata or altered them to suit their object without any regard to birth, religion or law" Mahabharata as it was and ever shall be (A critical study). అను పొత్తములో— పురాణములను గురించి లజపతిరాయిగారి కృష్ణచరిత్రములో నిట్లు కలదు.

"పౌరాణిక కల్పితములన్నియు మనవారిని తమజాతీయ వాఙ్మయమునుండి సత్యమును గనుగొనలేనంత యాశ్చర్యసాగ రములో ముంచి పరవశుల జేసివైచినవి. మనజాతియొక్క ప్రాచీనచారిత్ర మొక్కింత పురాణములవలన లభించగలిగి

నను కల్పితములు, ద్వంద్వార్థములు, రసికాగ్రేసరుల శృంగారములు, పండితవంశమువారి ప్రజ్ఞాతిశయములు మొదలయిన వన్నియు గలిసియుండుటచే, వీనిలోని సత్యమును వెలికి దీయుట సంభవముగ గన్పించుచున్నను మిక్కిలి కష్టముమీద బయటకు దీయుటకు వీలగునని నాఅభిప్రాయము. పూజారులు, శిష్యులు, భక్తులు మొదలయినవారలు, పలువురు మహాపురుషులయొక్క బాల్యాద్యవస్థలయందలి ప్రతి యల్పసంఘటనమునకును వాటిస్వరూపములు మాహాత్మ్యములుగ గన్పడునంతటి వేషముల వేయుటయే తమకర్తవ్యములుగ భావించిరి. హా! ఎంతవిచారము! ఈ స్వకపోలకల్పనాచతురులగు తాంత్రిక రచనాకర్తలు వ్రాసిపెట్టియుంచిన వృత్తాంతములలో వేయవ భాగము సత్యమైనను ఇంతటి దుర్విషయాభిరతుడు కృష్ణుడుకాకింకొకడు లేడనియు తన జీవితమునంతయును దుర్విషయములందే గడపెననియు నొకవిజ్ఞానముకల మనుష్యుడు నిరభ్యంతరముగ జెప్పుట కదియే చాలుచున్నది. దీని నిప్పటి పౌరాణిక విద్వాంసులుకూడ నొప్పుకొనుచునే యున్నారు. ఇందువలననే వారి మోహసల్లాపములకు సంబంధించిన కథలలో వేదాంత విషయము లున్నవని చూపుటకు యత్నించుచుందురు.”

“కవులు తమ ఉపమానోపమేయములకును ఉత్ప్రేక్షలకును శ్లేషలకును శృంగారవర్ణనములకును భావార్థప్రకటనములకును అంధవిశ్వాసములకును గృష్ణుని గుఱిజేసి యాతనిపై

యెంతక్రూరతను యెంతదౌర్జన్యతను యెంతటియన్యాయమును జూపిరో అంతమితిమీరిన విషయమునకు సమాధానము ఈ ప్రపంచములోని యే గ్రంథభాండాగారమందును గన్పించదు." కృష్ణచరిత్రము 94 పుట. వేదములలోగూడ నిట్టి ప్రక్షిప్తములు కలవు. అల్లోపనిషత్ అను నుపనిషత్తొకటి కలదు. పదునెనిమిదవశతాబ్ది ప్రాంతమున శాఖభావనుడను బ్రాహ్మణబృవుడు మహమ్మదీయ ప్రభువొసగు ధనమున కాశించి ఈ ఉపనిషత్తును రచించెను. ఇందు 'అల్లా' యే పరమాత్మగా వర్ణింపబడెను. చూడుడు. విజ్ఞానసర్వస్వము — అల్లోపనిషత్ అను శీర్షికగల పదమును.

ఆయాకాలములందలి ప్రజ్ఞాదిదృక్షువులును, మతావేశపరులును, వామమార్గగాములగు శాక్తేయులును, శైవ, వైష్ణవ శాక్తమతాభినివేశులై, మూలభాగములతో తమ రచనలను గలుపుచు వచ్చుటలో వెనుకముందులారయలేదు. కృష్ణుని విష్ణునవతారముగ జూపుటలో స్వభావశూన్యములగు ననేకమహిమల నతనియం దారోపించుటకు విష్ణుభక్తులుకూడ వెనుకాడలేదు. దివ్యజ్ఞానసమాజమువారు కృష్ణుని చరిత్రను వేదాంతపరముగ సమన్వయపరచి వ్రాసిరి. ఢిల్లీ హిందూకాలేజి ప్రిన్సిపాల్ యన్. వి. తడనీగారు Mystery of the Mahabharata అను పొత్తములో భారతపాత్రల నన్నిటిని ప్రకృతి వేదాంతశాస్త్రములకు ముడివెట్టిరి. వ్యాసుడు బ్రహ్మ

సూత్రములయందలి గోప్యార్థములను సులభముగ జనసామా న్యమున కందించుటకే భారతమును వ్రాసెనని తేల్చిరి.

ఆగ్రంథమును జదివినచో కురుపాండవ చరిత్రము పూర్తిగ గల్పితమని నాబోటియాత డెంచగలడు. ఇట్లే రామాయణమునకును వేదాంతమును ముడిపెట్టువారు పలువురు కలరు. గీర్వాణభాషయందు వ్యాకరణమును స్వాధీనమందుంచుకొనిన వారెల్లరు శబ్దమునేకాక ప్రత్యక్షరమును చితుకగొట్టి రూపమును మార్చి రసాభాసమును జేయ నవకాశమును గల్పించుటచే నిజరూపము మఱుగుపడి రసవిచ్ఛిత్తి కలుగగలదు. కృష్ణవిషయమున లజపతిరాయిగారి అభిప్రాయమునింకను జూపుటయేకాక సహృదయులమై వారితో మనముకూడ పరితపింతము. "ఇప్పటికి దాదాపుగ నిరువది సంవత్సరములక్రిందట మేము దొరతనమువారి పాఠశాలలలో విద్యాభ్యాస మొనర్చుతఱి శ్రీకృష్ణునిపేరిట నచ్చటచ్చట కొంచెము హెచ్చుతక్కువగ నిప్పటికి జరుగుచున్న రాసలీలాది విచిత్రకార్యముల జూచి మా అభిప్రాయమునం దితడొక యపవిత్రమనుజుడనియు, తెలివికల రసికుడనియు, సదా దుర్వ్యసనలోలుడనియు మీదుమిక్కిలి హిందువుల ప్రస్తుత మానసికశక్తి హైన్యమున కంతటికి నీతని యయోగ్యవర్తనముల పరిణామమే హేతువనియు భావించి యుంటిమి......

ఈ సందేహరూపక తార్కికాభిప్రాయము బీజమాత్రముగనే యుండి ఇంకను మాహృత్క్షేత్రమున జక్కగ నాటుకొనక

మునుపే, ఏకథలు దుర్విషయిక సంబంధములగు రాసలీలాది కళంకములను శ్రీకృష్ణుని కంటించుచున్నవో అవి యన్ని యును కవులు తమ అశ్లీలోక్తులను బ్రకటించుకొనుట కాతని నొక గుటికగా వించుకొని రచింపబడిన కల్పితములే కాని సత్యమగు చారిత్రక గౌరవము నందుటకు తగినవి కావని తెలిసికొనుట కా కథలందే ప్రబలములగు సాక్ష్యములు దొరకినవి." కృష్ణచరిత్రము 94 పుట.

కృష్ణచరిత్రను విష్ణు-భాగవత-హరివంశములతో బాటు వివరముగ జెప్పిన వానిలో బ్రహ్మవైవర్తపురాణ మొకటి.

"బ్రహ్మవైవర్తపురాణము ధర్మముపేరున నడచుచు మరుగునం దనేకావాచ్యకార్యము లొనర్చెడి గోకులవల్లభాచార్య, సాంప్రదాయికులగు గోసాయీలచే రచింపబడినది. ఆపిమ్మట వారల శిష్యుడు నారాయణభట్టు, వ్రజయాత్రయను పొత్తమును వ్రాసి కృష్ణలీలావిలాసాదులకు బ్రప్రథమక్రియానుష్ఠానమును నడపెను. కావున నా సమాజమువారే పై కల్పనమునకు మూలపురుషులు."

— కృష్ణచరిత్రము

"రథంతరస్య కల్పస్య వృత్తాంతమధికృత్యతు
సావర్ణినా నారదాయ కృష్ణమాహాత్మ్యముత్తమం
యత్రబ్రహ్మవరాహస్య చరిత్రం వర్ణితం ముహుః
తదష్టాదశసాహస్రం బ్రహ్మవైవర్తముచ్యతే"

— మత్స్యపురాణము.

ప్రస్తుత దృశ్యమాన బ్రహ్మవైవర్తములో పైనచెప్పబడిన నారదునికి సావర్ణి చెప్పిన కృష్ణచారిత్ర కాని బ్రహ్మవరాహచరిత్ర కాని రథంతర కల్పవృత్తాంతము కాని — లేవు. ఆ కథలందుండవలెనని మత్స్యపురాణ మనుచున్నది.

కాననే ఆపురాణము వ్యాసప్రోక్తము కాదని తేలుచున్నది. భారతమున కృష్ణుని జీవితయాత్రకు దగిన కథాభాగము మాత్రమే యున్నది. ప్రక్షిప్తభాగముల విమర్శించి విడదీయువారులేరు. రచనలలోని నవ్యత, కథాసందర్భశూన్యత్వము, పాత్రస్వభావదూరత్వము, వాని ఆధునికతను పలుముఖముల జాటుచుండును. అట్టివానినే మనమిప్పుడు చూడవలసి యున్నది. విల్సనుపండితుడు విష్ణుపురాణపీఠికలో వ్రసినట్లు పురాణముల కాలము నవ్యమైనను తానూహించినంత యాధునికములుకావు. ఈతడు శ్రీమద్భాగవతమును క్రీ. శ. 1200 లుగ వ్రాసినాడు. ఆరవశతాబ్దమువాడని యెంచబడుచున్న కాళిదాసు మేఘసందేశములో "రత్నచ్ఛాయావ్యతికరఇవ ప్రేక్ష్యమేత త్పురస్తాద్వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుఃఖండమాఖండలస్య। యేనశ్యామం వపురతితరాం కాంతిమాపత్స్యతే తే బర్హేణేవ స్ఫురితరుచినాగోపవేషస్య విష్ణోః" శ్లోకములోని వర్ణనమున కాకరమగుచున్న శ్రీమద్భాగవతము — దశమస్కంధము — ఒకటవ అధ్యాయము — నాల్గవశ్లోకము. బర్హాపీడంనటవరవపుః కర్ణయోః కర్ణికారం। బిభ్రద్వాసఃకనక

కపిశం నైజయస్తీంచమూలాం॥ పన్నెండవ శతాబ్దిలో బుట్టిన దనుట యెట్లు? శ్రీశంకరుని భాగవతవ్యాఖ్యను దానెరిగినట్లు విజయధ్వజాచార్యులు వ్రాసియున్నారు. శ్రీశంకరుల భాగవతమును ప్రబోధసుధాకరరచనమున కాకరమని పలువురు పెద్దలు అభిప్రాయపడిరి. శంకరుడు క్రీ. పూ. మూడవ శతాబ్దివాడం డురు. అప్పటికే విశేషవ్యాప్తినొందిన భాగవతము పదిరెండవ శతాబ్దమున కెట్లు కొనిరాబడినదో? ఇతడు లింగ, శివ, భవిష్యోత్తర, మార్కండేయోత్తర "గాథలను" పదివందల ప్రాంతమునకు దించినాడు. మార్కండేయోత్తర, భవిష్యోత్తరములు ఉపాునవ్యములని వానియునికియే తెలుపుచుండ వానిని శివ, లింగములతో గలిపినాడితడు. వీబరు, పరాశరుడు (వ్యాసుని తండ్రి) పదమూడవ శతాబ్దివాడనెను. వ్యాసుడు మహాభారత రచయితలలో మొదటివాడు. తెలుగు భారతమును రచియించిన నన్నయభట్టారకుడు పదనొకండవ శతాబ్దివాడు. పదమూడవశతాబ్దిని బుట్టబోవు భారతమును రచించెనా! నన్నయ?తిక్కయజ్వ పరాశరునితో సంప్రదించుచునే విరాటాదిభారతమును వెలిగించినాడుకానోపు. ఈనన్నయాదు లడ్డువచ్చెదరని "వీబరు" (vebar) గా రెరుగరు. ఇట్లుం డును మనగ్రంథములను గురించి కొందఱు విదేశీయులు చేయు విమర్శనములు. వీని నాధారములుగగొని మన విమర్శకమహాశయులును గ్రంథకర్తలునుకూడ తప్పుడు వ్రాతల వ్రాసిరి. వ్రాయుచున్నారు. బాల్యాదికృష్ణుని చరిత్ర మనేకరూపము

లతో నలౌకికమహిమల జూపుచునే పురాణములు నడపినవి.
శిశుకృష్ణుని యమునాతరణమును జూడుడు.

దేవకీం వసుదేవంచ నిగృహ్యానిగళైర్గృహే. భాగ.
ద. ౧ అ. 65 శ్లో.

ఇక్కడ వసుదేవుని కాళ్లు సంకెలలచే బిగించబడినవిగ
గన్పట్టుచున్నదికదా !

దేవక్యాశయనేన్యస్య వసుదేవోథదారికాం
ప్రతిముచ్యపదోర్లోహమాస్తే పూర్వవదావృతః.

భా. ద. 3 అ. 5 శ్లో.

సంకెలలు విడచుకొనుచున ట్లుండుటచే వెనుక సంకెలలచే
బిగింపబడియే యుండుట నిజము.

వసుదేవ ఉపాశ్రుత్యభ్రాతరం నందమాగతమ్
జ్ఞాత్వాదత్తకరంరాజ్ఞేయయౌతదవమోచనం.

(నివాసస్థానం)

నందుడు బసచేసిన యింటికి వసుదేవుడు వెళ్లినట్లుం
డుటచేత కంసునిచే (Perol) సంకెలనుండి ఎప్పుడు విడిపింప
బడెనో ?

మోచయామాసనిగళాద్విస్రబ్ధః కన్యకాగిరా !

ఇట్లు విడిపించబడియు తిరిగి సంకెలల బిగింపునొందినాడు
భాగ. 10 స్కం. 4 అ. 23 శ్లో.

ఈ సంకెలలు కంసుడు వచ్చినప్పుడు తగిలించుకొను నట్లు ఏర్పాట్లు జరిగించుకొనుచేమో: చూడుడు. 3 అ. 53 శ్లో. తీసి తిరిగి తగిలించికొనినాడీతడు. కృష్ణునికి పన్నెండవ సంవత్సరము వయసున కంసుని వధించిన పిమ్మట.

మాతరం పితరంచైవమో చయిత్వాతుబంధనాత్.
(సంకెలలు) భా. 10 స్కం. 5 అ. 19 శ్లోకము.

విడిన ఈకాలము, బహుశః (Internment)గనుండును. అయినచో లోహానిగళశబ్దము లేల సిద్ధించినవో? ఈసంసర్గ రాహిత్యవలన నీఘట్ట రచనము పృథగ్రచయితను దలపింప జేయుచున్నది.

తాఃకృష్ణవాహే వసుదేవఆగతే స్వయంవ్యశీర్యంతయ థాతమోరవా। వవర్ష పర్జన్యఉపాంశు గర్జిత శ్శేషోన్వగాద్వారిని వారయన్ఫణైః మఘోనివర్షత్యసకృద్యమానుజా గంభీరతో యాఘుజవోర్మిఫేనిలా। భయానకా వర్త శతాకులానదీ॥ దశ. 3 అ. 50–51 శ్లోకములు.

ఈశ్వరాంశమని చెప్పుట కీయారభటి యవసరమే లేదుకదా! ఈ సంఘటనము జరిగిన కొలది రోజులకే అనగా పదునైదురోజులలో మధురలోనున్న కంసునికి పన్ను చెల్లించు టకు వెళ్లియున్న నందుడు తిరిగి వ్రేపల్లెకు ఎడ్లను బూన్చిన బండ్లపై వెళ్లినట్లున్నది.

అనోభిరనడుద్యుక్తైస్తమనుజ్ఞాప్యగోకులమ్. ద. 5. అ. 32 శ్లో. పై నద్యవరోధ మేమయినది ?

అనస్స్వారోప్య గోపాలాయత్తాఆత్తశరాసనాః. ద.11 అ. 37 శ్లో. అని బృందావనమునకు గాపురముల నెత్తివెళ్లి నప్పుడు నందాదు లెడ్లబండ్లపైననే ప్రయాణమును జేసిరి.

శకటానుత్తమాచిరం. ద. 11 అ. 35 శ్లో.
తదాయశోదా రోహిణ్యావేకంశకటమాస్థితే. 40 శ్లో.
తత్రచక్రుర్వ్రజావాసం శకటైరర్ధచంద్రవత్. 41
యుంజ్యంతాం శకటానిచ. 29 అ. 11 శ్లో.
నందాద్యాశ్శకటైస్తతః. 33 శ్లో.
సరిత్తీరగతం కృష్ణం భగ్నార్జున మథాహ్వయత్.
ఇట్లే 10, 11, 16 శ్లోకములు.
బృందావనచరః క్వచిత్ కాళిందీం సఖిభిఃవృతః. 15 అ. 46
భగవల్లక్ష్మణైర్జుష్టః పదవ్యాయమునా తటం. 16-16 శ్లో.
ఆప్లుత్యాంభసి కాళింద్యాః జలాంతే. 22—2
కాళింద్యాంస్నాతు మన్వహం. 42—5
ఏకదా దేవయాత్రాయాం గోపాలాజాతకౌతుకాః
అనోభిరనడుద్యుక్తైః ప్రయయుస్తంబికావనం.

ఇప్పుడీనది యేమయినదో ? బృందావనమున నున్న కృష్ణబలరాముల గొనివచ్చుటకు బోయిన అక్రూరుడు రథముపై వెళ్లెను.

రథమాస్థాయప్రయయౌ నందగోకులమ్. ద. 38అ. 1శ్లో.
అథావతీర్ణస్సపదీశయోరథాత్ప్రధానపుంసోః. 11-14 శ్లో.
రథేనగోకులం ప్రాప్తః. 23 శ్లో.
రథాదవస్కంద్య. 25 శ్లో.
రథమారుహ్యావేగతః. 26 శ్లో.
రథాత్తూర్ణమవప్లుత్య. 35 శ్లో.
బలభద్రః కురుశ్రేష్ఠ భగవాన్రథమాస్థితః.
సుహృద్దిదృక్షురుత్కంఠః ప్రయయౌనందగోకులమ్.
65 అ. 1 శ్లో.

రథమునెక్కి బలరాముడు గోకులమునకు బోయెను. ఉద్ధవుని కృష్ణుడు తనబంధుదర్శనార్థము ప్రేపల్లెకు బంపినప్పుడు రథముపై వెళ్లెను. 46 అ. 8-47 శ్లోకములు.

హరివంశమును జూతము.

గచ్ఛానయాన్వై నేహత్వం వ్రజమేవయశోదయా
రహస్యం వసుదేవేన సోమనుజ్ఞాతో మహాత్మనా
యానంయశోదయాసార్ధమారురోహముదాన్వితః
కుమారస్కంధవాహ్యాయాం శిబికాయాం సమాహితః
సంవేశయామాస శిశుం శీతలానిలసర్పిణా
బహూదకేనమార్గేన యమునాతీరగామినా

సదదర్శశుభే దేశే గోవర్ధనవనోపగే
యమునాతీరసంబద్ధం శీతమారుతసేవితం
... ... ... ..
గోవ్రజం గోరుతశివం గోపనారీభిరావృతం
హుంభారవైశ్చవత్సానాం సర్వతోకృతనిస్వనం
... ... ... ...
యమునాతీరమార్గేణ జలహారిభిరావృతం
సతత్రప్రవిశన్ హృష్టో గోవ్రజం గోపనాదితం
నివేశంరోచయామాస పరివర్తే సుఖోదయే.

61 అ. 31 వరకు.

తెలుగు హరివంశము పూర్వభాగము 55 వ ఆశ్వాసము.

121 వ పద్యము "ఏవేదనయు నొందకింపార...... నంతిపురము వెడలి నందగోపునింటికి నవ్యసూతి"

యయ్యశోదయు విష్ణుమాయావిమూఢ, యగుటనొం డెఱుంగక యున్కి కూతుగాంచు......మగుడ జనుదెంచె దేవకీదేవి తల్పంబున నిడిపోయి, తత్ప్రసవసూతంబు కంసుని కిం జెప్పిన"

136 వ వచనము. అంత నా ప్రొద్దు వసుదేవుండు.

కం. ముదమొనగ నందగోపుని
సదనంబున కేగి పుత్రజననంబున స

మ్మదభరితుడైన యతనిని
హృదయప్రియసుహృదుగాంచి యిట్లనియెడగన్.

మ. సుత సత్యద్భుతలక్షణాన్వితుని దేజోభాసితుం గంటివీ
నతిధన్యుండవు భామినీసహితమీయాతోన్మదస్వభావుంగొంచుధీ
యుత ! మీచోటగు గోకులంబునకు బొమ్మున్నాడను,
ప్రేవల్లె, నా
సుతుడారోహిణి గన్నవాడును, భవత్సూనుండ, కా,
జూడుమీ.

తే. పురిటిపాపని దొట్టిలో బొందుగాగ
బెట్టి మోపించుకొని తాను ప్రియసతియును
మేటిగుజ్జులగట్టిన పాలుబండి
యెక్కి శీఘ్రుంబ మందకు నేగెనలమి.

ఇక్కడ గొన్నిసంశయములు లేకెత్తినవి. చూడండీ పాఠకులు. కష్టము నర్పింపబోయిన నందుని యశోద కూడ వెంటాడినది. వసుదేవు డక్కడ కాన్పునొందిన యామె ప్రక్కలో బాలునిడి బాలికను గొనివచ్చినాడు. ఎదుట జరిగిన ఈ సంఘటనమను నందు డెరుగనే యెరుగడు. నిద్రలోనున్నది యశోద, తెలుగు హరివంశములోను మూల ములోను యీనారూఢగ గన్పించును. కానిచో పిల్లలుమోసిన అందలములో పిల్లవాని నామె కెట్లు చేర్చెను వసుదేవుడు ! చల్లని నీటిగాలి తగులుచున్న యమునాతీరమార్గమున

గోవర్ధన వనప్రాంతమట. శిశుప్రాప్తిస్థలము నందు జేరియే యున్నాడనుటకు ప్రయాణముచేసిన యానము భార్యాసహాధిష్ఠితము. రహస్యప్రయాణము. సాక్ష్యములు. మూలమున గల భిన్నస్థలపతితశ్లోకస్థితి విమర్శనీయము కదా? "గచ్ఛానయా—నేహా—వ్రజత్వం." ఇక్క డుండవలదు — ఈ మెతో గొల్లపల్లెకు బొమ్ము — అనువాదములో. పుత్రజననసమ్మోదముతో నున్నాడు నందుడు. తనయింటిలోనే వ్రేపల్లెలో. వసుదేవుడటకు జేరినాడు. ఈ హృదయప్రియ సుహృదుని, నందుని కనుగప్పినాడు వసుదేవుడు. అద్భుతలక్షణాన్వితుడగు కొడుకును గనిన నీవు ధన్యుడవైతివి. ఆత్మోద్భవుడగు నీశిశువుతో గోకులమునకు బొమ్మనును. బండి నెక్కివెళ్లినాడు నందుడు — రహస్యసంభాషణములో అబద్ధమాడుట వలన గలిగినలాభము కన్పించదు.

"ముదము" మొదలు "ఎలమి" వరకు గల పద్యముల పిమ్మట "తత్ప్రసూతంబు కంసునికిం జెప్పిన" మొదలుగ "అంత నాప్రొద్దున వసుదేవుండు" చేర్చవలసినట్లున్నది. ఈ యంశములన్నియు విష్ణుమాయా విమూఢసాంబంధికములు కావా? ఉపర్యాలోచనముచే మధురానగరికిని, వ్రేపల్లె మొదలగు కృష్ణచరితస్థలములకును నడుమ నది అడ్డముండినట్లు లేదు. బండ్లు, రథములుకూడ నదిని దాటించు సాధనములతో నిమిత్తము లేకయే గమనములు సాగించినట్లు కన్పించుచున్నది. యమునయే కాళిందిగ పలుచోట్ల భాగవత

మున వర్ణితము. రామాయణకాలమున ఈ నదులు వేఱ్వేఱు స్రోతస్సుల నడచుచున్నవి. నదీవిప్లవములు గ్రామముల వెనుకకు జరుపుచుండునేకాని దాటించుకొనుట కానము. చిరకాల వ్యాప్తిచే నయ్యయిపట్టనములు కాని నదులు కాని దూరగతములు కావచ్చును. ప్రస్తుతపు, ముత్రా (Muttra) (మధుర) పూర్వపుది కాదనినచో పురాణకథితములగు కాశీ, రామేశ్వరము, అయోధ్య, నాసిక మొదలయిన పుణ్యతీర్థముల యస్తిత్వము లోపించగలదు. పోనిండు. భూగతములగువానిని వదలి నదీగతములగు వానిని జూతము. పట్టిసమను క్షేత్రము గోదావరీనదీగర్భమున చిన్నపర్వతప్రదేశము. ఇట్లే మహానందీశ్వరక్షేత్రము, రెండును స్కాందమున వర్ణితములు. నేటికి నట్లే యున్నవి. ఆపట్టిసక్షేత్రమిది కాదనువారు కానరారు. భూగర్భగతములు, నదీగర్భగతములు నయినజాడలు కొన్నిప్రదేశములకు నేడు కన్పించుచున్నవి. కాని విశేష దూరగతములగు జాడలు కన్పించుటలేదు. ప్రస్తుతము వ్యాప్తిలోనున్న హిందూదేశపటమును జూడుడు. మధుర, బృందావనము, గోవర్ధనము, వ్రేపల్లెయు (గోకులము) యమున కెడమ వైపుననే యున్నట్లు స్పష్టముగ గన్పట్టుటచే శిశుకృష్ణతరణమున వర్ణితమయిన యమునానద్యవరోధము భక్త్యుద్రిక్త మనస్కతను రేకెత్తించుట కేర్పడినసఘనోపన్యాసముగ జెప్పక తప్పదు. ఇట్టివనేకములు బురాణములలో ప్రక్షిప్తము లగుచు వచ్చినవి.

జీవయాత్రలో వివాహమును పవిత్రవిషయ మావ్యక్తి తేజస్సును విరజిమ్ముచున్నదిగా నుండును. కృష్ణునివంటి యాదర్శ పురుషుడు పదియారువేల నూటపదారుగురు స్త్రీలకు భర్త. ఒకప్పు డష్టమహిషులకు బెనిమిటి. ఒకప్పుడు సాత్రాజితీపాద కండూతినివారణార్థ మేర్పడిన గంటురాయి. బహుభార్యాత్వము నింద్యము కాని రోజులలో నాత డట్లుండెననుట సంభవము కావచ్చును. కాని జరుగ నవకాశమే కనుబడని విషయముల నాతని కంటగట్టుటకు జతనముసలుపుట విచారకరము.

నందునిపల్లె చిన్న ఘోషము. ఘోషమన, గొల్ల-(క్రే)పల్లె. పల్లెగనే పురాణములం వర్ణనమున్నది. కృష్ణుని జన్మప్రదేశము మధురానగరము ( ముత్రా - Mutra ) పెద్ద పత్తనము. నేటికిని పత్తనమే. కవి పొరబడినప్పుడీ క్రేపల్లెనే పెద్ద పట్టణముగ మనకండ్ల కగుపడజేయును. నందు డాపల్లె కధికారి. ఈతడు వైశ్యుడు. గోరక్షకవృత్తిచే గొల్లడయినాడు. నందుని బంధువర్గము కొందరు. భాగవతమున జెప్పబడినట్లు వంశగురువులు మూడుకోట్లు యెనిమిదివేల యెనిమిది వందలు. (లక్షలు లేవు) గొల్లభామలు పదియారువేలు. వారి భర్తలు బందుగులు మొదలగు జనులు కొందరు — యజ్ఞాన్నమర్థింపవచ్చిన విప్రపత్నులు తత్తద్బంధువులు కొందరు. ఇతర జాతు లుండకతీరదు కావున వారు కొందరు. పై గురువులు దూరదేశగతులై వచ్చుచు బోవుచు నుందురని యూహించి

నను గొన్నికోట్లు జనులు నివసింపదగినదియేనా? గొల్లపల్లె! అయినచో పల్లెగ వర్ణింపబడక పట్టణముగనే వర్ణింపబడును కదా? కొంతకాలమునకు కాపురములు మార్చబడిన బృందావనపు వర్ణనమును జదివిన చిన్నదిగనే కనిపించును. భాగ. 10 అ. 18 శ్లో. ఈ బృందావనముకూడ భక్త్యుద్రేకమున పెద్ద పట్టణమగుచుండును. ఈ కృష్ణవాసస్థల నిర్ణయము చాలదా! గోపికల యస్తిత్వమును సంశయితము చేయుటకు? మధురా నగరికి కంసధనుర్యాగమునకు వెళ్లిన కృష్ణుడు అరువది సంవత్సరముల వయఃప్రాంతమున కురుక్షేత్రమున గ్రహణస్నానసందర్భమునగాని తిరిగి గోపికల గలుసుకొనలేదు. గోపికల ప్రేమ కృష్ణదర్శనాభావమున నరనిముసమైనను మృత్యుజనకమగునట్లు వర్ణింపబడినది. వలపుబల మట్టిదియకానోపును. చిరకాలమునకు గలిసిన కృష్ణగోపికాసంభాషణము భక్తిప్రేమ భరితముగ గన్పడుచున్నది కాని జారత్వసూచకముగ గన్పించదు. శృంగారైకప్రధానమగు కృష్ణుని హృదయము నాతి దూరగతలగు గోపికలను జూచుటకు దత్తరపాటొందకుండెనోటు! వలపుబలముచే నదుల నీదినవారిని వినియుంటిమి. రాత్రులందు చీకటిని, ముండ్లను గమనించక యగమ్యప్రదేశములకు బోవు తహతహ గలవారిని చూచుచుందుము. తులసీదాస, బిల్వమంగళుల చరిత్రముల జదివిన నిది తెలియును. ఇట్టిదియా? కృష్ణుని గోపికాప్రియత్వము? ఈహేతువు కృష్ణగోపికాసంబంధమును శూన్యమనుచుండుటలేదా! పలుచోట్ల

గోపికాసహస్రయుతి వర్ణితమగుటవలన సత్యాన్వేషణమునకై యింతగా వ్రాయవలసి వచ్చినది. రామావతారావసానసమయమున మునులు మోహించి సంసరణమును గోరగ ముందవతారమున నిచ్చెదనని హామీయిచ్చెదనను కల్పనము కలదు. ఒకరా? ఇద్దరా? పదియారువేల నూటపదియార్గురు తపశ్శాలు రింద్రియలోలుపతనొంది ఒక్కపర్యాయమే రాముని మోహించిరనుట సందర్భముగ నున్నదా? యుగాంతరమున నిచ్చెదనని రాముడు మాటనిచ్చుట యెట్లో! యుగమేమో? తానేమో! వివక్ష లేకుండుటకు రచయిత భక్తిలోని తొందరపాటునే కారణముగ గ్రహింపవచ్చును. భాగవతమున గృష్ణునితో నవరేవరేరూపముల జన్మించిరో వ్రాయబడినది. పూర్వకల్పన ననుసరించినచో మునులు గోపికలుగ కాని రాజకన్యలుగ గాని జన్మించి జీవితాంతమున మునులుగనే రూపముల నొందవలసి యుండగ "షోడశస్త్రీ సహస్రాణి వాసుదేవపరిగ్రహాః। అమజ్జంస్తాస్సరస్వత్యాం కాలేనజనమేజయ। తత్రత్యక్త్వాశరీరాణి దివమారురుహుః పునః। తాశ్చైవాప్సరసోభూత్వా వాసుదేవముపాగమన్॥ మహాభారత స్వర్గారోహణపర్వము-5 అధ్యాయము. 24—25 శ్లోకములలో జెప్పిన ట్లప్సరసలైపోయిరి. కావున కృష్ణస్త్రీలు పూర్వజన్మమున మునులు కారని తేలినది. ఈ విషయము రామాయణమున ముఖ్యముగా నుండవలసి యుండగ నీప్రసక్తి రామాయణమున లేనేలేదు. కావున నిది వ్యర్థోపన్యాస రూపమనక తప్పదు. కృష్ణుడు

నరకాసురుని చెఱనుండి విడిపించిన పదియారువేల నూర్గురు కన్యలను వివాహమాడినట్లు భాగవతమున గలదు. బ్రాహ్మ పురాణము వీరిని దేవజాతి స్త్రీలనియు పదియారువేలు కాక యెనుబదివేలనియు చెప్పుచున్నది. దేవజాతి స్త్రీలు భూమిపై నడుగులు మోపరని పురాణములలో గలదుకదా? నారదుని పరీక్షాసమయమున వీరిండ్లలోనే నివసించిన ట్లున్నది. వెనుక చెప్పిన గోపకన్యలు మధురాపురికి చేరకమునుపే కృష్ణునికి జెందినందున తరువాత సిద్ధించిన ఈ రాజకన్యలతో ముప్పది రెండువేల రెండువందల మించియుండవలెను. కవిప్రాగల్భ్యము నీఘట్టమున కుంటువడునట్లు చేసిన దీవర్ణనము. పదియారు వేలుగనే పలుచోట్ల చెప్పించి మైమఱచునట్లు చేసినది. శూన్య మగు దాని నస్తిత్వములోనికి దింపుటలో వచ్చినదీ చిక్కు - ఇంతటితో నీపదియారువేలు గోపకన్యలు కాని యెనుబదివేలు దేవజాతికన్యలు కాని మనదృష్టిపథమునుండి మరలింపబడెదరు కాక. ఇట్లు త్రోసివేయబడినను నరకుని కన్యలను గురించి మఱికొంచెము చెప్పవలసియున్నది. భాగవతమున నరకుని కన్యలు రాజకన్యలని యున్నది కదా? కృష్ణుని కాలమున హిందూదేశమున బదియారువేల రాజులు కలరా? రాజ్యము లన్నికలవా? రాజసూయసందర్భమున పాండవవిజయయాత్రా కాలమునగల రాజులసంఖ్య తెలియుచునే యున్నది. మహా భారతయుద్ధకాలపు భారతదేశ పటమును జూడుడు. ఒక్కొక్క రాజుగారికి వివాహవయసు కల్గిన కుమార్తెలు నలుగురున్నను

నాలుగువేలమంది రాజు లాకాలమున నుండవలెనుకదా? వీరు రాజ్యములులేని రాజులయియుండరుకదా? సామాన్యరాజకన్య లైనచో చెఱబట్ట యత్నించునా? భోగించుటకు దెచ్చినచో ప్రయత్నమునైనను జేసినట్లు లేదేమి? సౌందర్యలోలుపత కాక ద్వేషముపై దెచ్చినచో సామాన్యరాజకుటుంబములలోని వారైనను బాలురనుగాక కన్యలను మాత్రమే తెచ్చుట కేల పాల్పడును? జరాసంధునివలె రాజపుత్రులు కూడ గొనిరా బడిన యెడల గృష్ణుడు కన్యలనే కాని కుమారులను విడిపించి నట్లు లేదే! ఇదిట్లుండ నరకుని విషయమే సంశయించవలసి కన్పించుచున్నది.

నరకుడు విష్ణునవతారమగు వరాహమూర్తి వలన భూదేవికి పుట్టినాడని నరకుని వధ పిమ్మట భూమియే కృష్ణునితో చెప్పినట్లు విష్ణుపురాణము చెప్పుచున్నది. వరాహావతారము కృతయుగమునాటిది. కొన్ని వేలు త్రోసివైచినను నరకుడు కృష్ణుని కాలమునాటికి 3880000 సంవత్సరముల వయసువాడుగ నుండును. కావున కృష్ణుడు నరకుని చెఱనుండి సంపాదించి పెండ్లాడిన కన్యలావయస్సు ననుసరించియే యుండెదరు. విష్ణునిచే నరకుడు చంపబడెననియు, నాతడు విప్రచిత్తికి సింహికయందు జనియించినవాడనియు రామాయణము యుద్ధకాండము 66 వ సర్గము-అరువదవ శ్లోకము చెప్పుచున్నది. ఈ సింహిక హిరణ్యకశిపుని సోదరి. "శంబరో దేవరాతేన నరకో విష్ణునాయధా" "వాతాపిర్నముచిశ్చైవ ఇల్వలస్సృమ

ర స్తథా। అంధకోనరకశ్చైవకాలనాభ స్తథైవచ" విష్ణుపురాణము 69 అధ్యాయము-6 వ శ్లోకము=వ్యాఖ్య–నరకోత్రసింహికాయాం విప్రచిత్తేర్జాతేషు వాతాపిప్రముఖేష్వన్యతమః. అని యున్నది.

ఏతాన్యస్థీని దైత్యస్యనరకస్యమహాత్మనః।
పర్వతప్రతిమంభాతి పర్వతప్ర స్తరాశ్రితం।
పురాతనేనదేవేన విష్ణునాపరమాత్మనా।
మహాభారతం–ఆరణ్యపర్వము–142 అధ్యాయము–15,16 శ్లోకములు.

దైత్యోవినిహతస్తాత సురరాజహితైషిణా
తస్యవిష్ణుర్మహాతేజాః పాపినోచేతనాంహరత్
సపపాతతతోభూమౌ గిరిరాజఇవాహితః.

ఆరణ్యపర్వ ౧౪౨ అధ్యాయము–౨౬ శ్లో.

రావణుడు జైత్రయాత్రకై యమునిపై దండెత్తగా మృత్యువు చారులవలనవిని తనభృత్యులతో రావణుడు మృతి నొందదలచి వచ్చెను కాబోలునని చెప్పుచు సందర్భవశమున నరకుడు కూడ దనలోకమునకు మృతుడై చేరియున్నాడని చెప్పెను. రామా. ఉ. 22 సర్గ 30 శ్లోకము. ఈతడు రాక్షస జాతివాడు. కావున భూమిచెప్పిన నరకభౌమత్వ మసంగతము. భౌమ, కుజాది శబ్దముల నీకృష్ణవైరికి బ్రయోగించు టనుచితము. భూమిచెప్పిన నరకునికి భగదత్తుడను కొడుకున్నట్లు విష్ణుపురాణమే చెప్పుచున్నది. భగదత్తుడు క్షత్రియుడు. పాండు

రాజునకు స్నేహితుడు. ధర్మరాజ రాజసూయయాగ దండయాత్రా సందర్భమున నర్జునునకు మిత్రుడు. భారతయుద్ధమున నర్జునుని చేతనే చంపబడెను. నరకుడుకూడ క్షత్రియుడే. ఈతని తండ్రి వరాహముకాదు. కిష్కింధాకాండ 42 సర్గలో—యోజనానాం తతష్షష్టిర్వరాహో నామ నామతః। యత్ర ప్రాగ్జ్యోతిషం నామ జాత రూపమయంపురం। యస్మిన్వసతి దుష్టాత్మా నరకోనామ దానవః అ. 30, 32 శ్లో. తపోబలముచేత ఇంద్రలోకము నొందినశైలాలయుడను రాజు—

తథా శైలాలయో రాజా భగదత్తపితామహః
తపోబలేనైవనృపో మహేంద్రసదనం గతః॥

మహాభారతం- ఆశ్రమవాసపర్వము–21 అ–8 శ్లోకము.

సఖాయమింద్రస్య, ద్రోణపర్వ 26 అ. 46 శ్లో. ప్రియమింద్రస్యసతతం సఖాయమమితౌజసా, 30 అ. 1 శ్లో. నరకుడు కంసుని మిత్రుడు. కంసుడు కృష్ణుని కనిష్ఠమాతామహుని కుమారుడు. యదువంశమువాడు. నరకుడుదుష్టకంసుని స్నేహితుడగుటచే రాక్షసుడుగ వాడిరి. నరకుని తండ్రి యింద్రుని స్నేహితుడు, రాక్షస దేవజాతులకు స్నేహమెట్లు లబ్ధమైనది?

అన్యైశ్చాసురభూపాలై ర్బాణభౌమాదిభిర్యుతః

భాగవతము దశమస్కంధము 2 అధ్యాయము రెండవ శ్లోకము. ఇందు రాజుగ చెప్పబడినాడు నరకుడు. కృష్ణుని కాల

మున కంసుని స్నేహితుడగు నరకుడుండెను. నరకుడు శైలాలయుడను రాజపుత్రుడే. వరాహతనయుడు కాడు. కంససహాయుడగుటచే నాతనిని కృష్ణుడు చంపెను. ఇంతమాత్రమే మన దృక్పథము నాక్రమించుటకు పురాణములలో సర్వాత్మకలదిగ దోచుచున్నది. పై యలౌకికాసందర్భవిషయముల ననుసరించి నరకునిచే చెఱబట్టబడిన పదియారువేల నూటపదియార్గురు కన్యలతోడి కృష్ణుని వివాహము రద్దుపడినదని నాఅభిప్రాయము. నరకచతుర్దశి నరకవధ నుద్దేశించి చేయబడు పండుగ యని పలువురభిప్రాయ పడుచున్నారు. ఈనరకచతుర్దశి పలుచోట్ల వర్ణితమగుట విష్ణుపురాణము తరువాతనే కావచ్చును. కార్తిక బ ౧౪ శిని నరకచతుర్దశి యనుచున్నది. భవిష్యత్పురాణము. దివోదాసుని స్మృతిదర్పణము ఆశ్వయుజ ౧౪ శిని నరకచతుర్దశిగ జెప్పుచున్నది. భవిష్యోత్తరభాగములో గృష్ణుడు ధర్మరాజుతో చెప్పినట్లు బలిచక్రవర్తి వాక్యానుసారము దీపదానము చేయబడవలెనని యున్నది. ఆశ్వయుజ బ ౧౪ శి రోజున తనచే పాలింపబడుచుండిన పాతాళవాసుల లక్ష్మీప్రాప్తికై దీపారాధనము చేయవలయునని బలిచక్రవర్తి భగవంతుని బ్రార్థించి యేర్పాటు చేసికొనిన దినముగ జెప్పబడినది. చూడుడు వ్రత చూడామణిని — ఇందుననే కార్తిక బ ౧౪ శీ దినము నరకచతుర్దశి పేరిట నరకలోకాపనుత్యర్థమై వ్రతము చేయవలయునని యున్నది. జయసింహాకల్పద్రుమమున “ చతుర్దశీదినేరాజ్యం బలేరస్త్వితియాచయేత్ ॥ పురావామన

రూపేణ ప్రార్థయిత్వాథ రామిమాం। స చావతిథిరింద్రాయ బలిం పాతాళవాసినం కృత్వాదైత్యపతిందద్యాదహోరాత్రత్రయం హరిః। తస్మాన్మహోత్సవం చాత్రసర్వధైవహికారయేత్. అనియున్నది. బొంబాయిలో ప్రకటింపబడిన భారతీయ విద్య 1947 మార్చి సంచికలోని, దివాళీ, వ్యాసమును జూచిన నరకుని కథాసందర్భరాహిత్యే గోచరింపగలదు. నరకచతుర్దశిలోని నరకశబ్దమునకు యమలోకమర్థము — "యమాయ ధర్మరాజాయ మృత్యవేచాంతకాయచ" అను వ్రతచూడామణి శ్లోకమును జూడుడు. ఏగ్రంథమందు నీవిధమగు నరకప్రసక్తి కనుపించదు. నరకునికంటె బలవంతులు ప్రసిద్ధులు తపశ్శాలురు విష్ణుభక్తులు కలరు. ఎవ్వారికిని లేని యాధిక్యతను నరకునకే గల్పించుటకే ఆశ్వయుజ బహుళ చతుర్దశి ఏర్పాటు కాబడియుండలేదు. నరకబాధానివారణార్థ మీవ్రతము కథితమై యున్నది. నరకవధ నుద్దేశించి ఈ పండుగ చేయబడుచున్న దను భావమును చదువరులు మరలించుకొనెదరుకాక.

## అష్టమహిషులు

శ్రీమద్భాగవతమున రుక్మిణి, సత్యభామ, నాగ్నజితి, కాళింది, మిత్రవింద, జాంబవతి, మాద్రి, లక్ష్మణ యను నెనమండుగురు పట్టమహిషులు కృష్ణునికి కలరనియున్నది. రుక్మిణీకళ్యాణమును విననివారు సాధారణముగ నుండరు. రుక్మిణి విదర్భరాజు తనయ. తండ్రి భీష్మకు డీమెను గృష్ణున కీయనెంచెను. ఈమె

కృష్ణునియందనురక్త. ఈమె సోదరుడు రుక్మి తండ్రి మాటను ద్రోసిపుచ్చి తనమిత్రుడగు శిశుపాలుని కీయనెంచగ కృష్ణుడామెను రాజలోకము నెదుట రథముపై నిడుకొనిపోవుచు యుద్ధమునకు డీకొనిన రుక్మి స్నేహితులను గెలిచి ద్వారకకు గొనిపోయెను. "యోరుక్మిణీమేకరథేనభోజా నుత్సార్యరాజ్ఞః సమరే ప్రసహ్య" అని వీరత్వముగ్గడింపబడెను. సభాపర్వమున శిశుపాలునిచే నిందింపబడిన కృష్ణుడు "వీడాశించిన కన్యను నేను వివాహమాడితినని నాపై వీనికి గోప" మనెను. శిశుపాలుడు కృష్ణుని "ఇతరులు వరించుటచే వివాహితయయిన కన్యను వివాహమాడి నీవేల సిగ్గుపడవు?" అని వివాహమునే దృఢపరచెను.

ఉద్యోగపర్వము 57 అధ్యాయములో రుక్మిణీహరణము చెప్పబడినది. భారతయుద్ధమునకు పూర్వమే అనిరుద్ధుని వివాహకాలమున రుక్మి బలరామునిచే జంపబడిన ట్లుండిన గాథనుమార్చి రుక్మియొక అక్షౌహిణీసేనతో అర్జునునికి సాయపడుటకురాగ నాత డొప్పుకొనక తిరస్కరించగ దుర్యోధనుని యొద్దకు పోయిన నాతడును తిరస్కరించగ మృతినందెనని కల్పనముకల యీ 57 అధ్యాయము ప్రక్షిప్తమనుటలో వెను తీయవలసినది లేదు. చూడుడు. భాగవతము. దశమస్కంధము. 50-78 అధ్యాయములను. పై కారణములవలన రుక్మిణి వివాహితభార్యయనియు హరింపబడినదని యితరస్థలములందున్న వానికి గొనిపోబడెనని మాత్రమే అర్థమనియు నాఅభిప్రా

యము. అష్టమహిషులలోనివారగు సత్యభామాజాంబవతు లిద్దరును స్యమంతకమణి మూలమున గృష్ణునికి లభించినవా రలు. ద్వారకాపురవాసి సత్రాజిత్తు ధరించుచుండిన మణిని కృష్ణుడు కోరెను. సత్రాజిత్తు నిరాకరించెను. ఆమణి నాతని తమ్ముడగు ప్రసేనుడు ధరించి, కృష్ణుడుపోయిన త్రోవనే మృగయా యాత్రకు బోయెను. కోరినమణి దొరకుటలో గల యవకాశమును జారవిడువక ఒంటరిగ దొరకిన ప్రసేనుని జంపి మణి నపహరించె నని తనపై వ్యాపించిన నిందను తప్పించుకొనుటకు గృష్ణుడు జాంబవంతుని యునికిని దెలుసు కొని యాతనితో యుద్ధముజేసి మణిని గ్రహించి తెచ్చి సభా ముఖమున సత్రాజిత్తున కిచ్చెను. ఈ కథలో జాంబవంతుడు మణిని కేళీకందుకముగ నుయ్యేలకుగట్టినది బాలునియుయ్యేల కని "సుకుమారక మారోదీర్మణిర్హ్యేషస్స్యమంతకః" అని పురాణములు చెప్పుచుండ తన యనువాదమునకు మూల మగు శ్రీమద్భాగవతములోని "సోపిచక్రే కుమారస్య మణిం క్రీడనకంబిలే" శ్లోకమునకు వ్యతిరేకముగ పోత నామాత్యుడు మాత్రము బాలిక యుయ్యేల కని వ్రాసి నాడు. ఆ శిశు వెవ్వరైనను తరువాత జాడ తెలియదు. జాంబవంతునికి మానుషసంతానము కలదనుటకు మాత్ర మీకథ సాయపడును. "సుతాజాంబవతశ్చాపి" యని హరి వంశమునను "ఇత్యుక్తస్స్వాందుహితరం" అని భాగవతమునను దెలుపబడుచు బిలములో గృష్ణునితో జేసిన యుద్ధమున నోడి

పోయిన జాంబవంతుడు కృష్ణునకు మణితో కన్యనిచ్చెనని యున్నది. ఈమె జాడ చెప్పకయే మణితో కూతు నిచ్చెనను చోటమఱియొకామె చెప్పబడకుండుటచే నీడోలాగత బాలి కయే కృష్ణదత్తగా గన్పించును. ఈమెను పెంచి పెద్దదాని నిగజేసి కృష్ణుడు పెండ్లియాడెనుకాబోలు. భాగవతమున జాంబ వంతుని కన్నకూతురై నట్లే యున్నది. ఈమెపేరు రోహిణి యనియు కామరూపిణి యనియు విష్ణుపురాణము 28 అధ్యా యము చెప్పుచున్నది. హరివంశ మట్లే యనినది. జాంబ వంతుడు వెలుగుబంటి జాతివాడు. భయంకరుడు. మోటు మానిసిగదోచు నీతనిభార్య యేరాజకన్యయో! కృష్ణు డుయ్యాల లోని బాలికనువలె ఈ సుందరకుమారునివరించి ఈమె సుఖపడ దలచి ఎట్టినోములు నోచుకొనినదో! భల్లూకివంటిదియే కానో పును. హనుమంతునివలె నీతడు కామరూపి యగుట రామా యణమున గానము. ఈయన పుత్రిక మాత్రము కామరూపిణి. ఈవెలుగుబంటి పిల్లను కృష్ణుడు వివాహమాడి సరసమాడి నాడు. జాంబవతి యితర భార్యలువలె కాక కుమారుడగు సాంబునిచే తెలిసికొనబడుచున్నది. పార్వతి జాంబవతిగ జన్మించి కృష్ణుని పెండ్లాడినట్లు (శివ) పురాణము చెప్పుచున్నది. జాంబవతి కృష్ణునితో రుక్మిణికి పుత్రుడు కలిగినాడు, నా మనో భీష్టమును దీర్చుటలో దొందరగల నీవు నాకుగూడ సంతాన మును గలిగింపుమని కోరగ శివు నుద్దేశించి తపస్సు చేయు టకు దీర్ఘాటనమును సాగించి వనములవెంబడిని తిరిగి శివభక్తు

డగు నుపమన్యు నుపదేశమున నొక మహర్షి యాశ్రమములో పదునారు వత్సరములు పడరానిపాట్లుపడి తపస్సు చేసెను. శివుడు ప్రత్యక్షమై పుత్రుడు పుట్టునట్లు వరమిచ్చెను. తరువాత పార్వతిప్రత్యక్షమై శివుడువరమిచ్చెనుకావున పుత్రుడుకలుగును. ఇంకను నెనిమిది వరములు గోరుకొను మిచ్చెద నను కాని ఈయలేదు. పుచ్చుకొనలేదు. కృష్ణుడు వర మొంది తపస్సు చాలించి యింటికి జేరునప్పటికి సాంబు డను జాంబవతీ తనయు డెమరోలుత్సవమున బాల్గొనినాడు. ఇది కూర్మపురాణగాథ. సంతానజనక కృత్యమే నిత్యచర్యయైన కృష్ణుడు శివునిగురించి కొన్నివత్సరములు తపస్సొనరించుట చిత్రముగా నున్నది. కృష్ణుని సంతానము ఒక లక్షా యాభై వేలు. కృష్ణుని జీవితములో పది వత్సరములు చిన్నవయ సనుకొనినను మిగిలిన నూటయిరువది వత్సరములకు సగటున రోజునకు నలుగురు చొప్పునసంతానమును గనెనని చెప్పనగుచున్నది. సాంబుని పుట్టుక కృష్ణుడు తపస్సులో నున్నపుడే జరిగినట్లుండుటచే నసభ్యముగనున్నది. శైవమహిమ నుద్బోధించుటకీ కథ కల్పితమనుట తథ్యము. కూర్మము శైవము కదా! ఈ తపస్సంభవమును మహాభారత మంగీకరించినది.

వృణీష్వాష్టౌ వరాన్కృష్ణ దాతాస్మి తవసత్తమ
బ్రూహి యాదవశార్దూలయానిచ్ఛసి సుదుర్లభాన్.

ఆ. ను14 అ. 434 శ్లోకము

దత్తో భగవతా పుత్రో సాంబో నామ తవానఘ
మత్తో ప్యస్తౌ వరానిష్టాన్గృహాణత్వం దదామి తే.

అను. 15 అ. 305 శ్లోకము.

వరమిచ్చునప్పుడే సాంబు డను పేరు.

సాంబుడు జాంబవతి కొడుకని భాగవతము నుడువుచున్నది. భద్రగుప్త, భద్రజిత్, భద్రబాహు అను నలుగురు కొడుకులు రోహిణికి గలరని బ్రాహ్మపురాణము చెప్పుచున్నది. సాంబుడను కొడుకున్నట్లందు లేదు. భాగవతమున రోహిణీజాంబవతులు వేరుగ కన్పడుచున్నారు. ఈసాంబుడే దుర్యోధనపుత్రిక లక్ష్మణను గొంపోయి వివాహమాడినట్లు భాగవతమున గలదు. భారతమున లేదు. సాంబుని స్త్రీవేషధారిణిజేసి యదువంశక్షయకారణమగు ముసలమును సంపాదించుకొనినట్లు భారత మౌసలపర్వమున గలదు. ప్రక్షిప్తభాగముగ దీనిని బకించంద్రాదు లనిరి. ఇంకొక చిత్రవిషయమును చూపించెను. జాంబవతీ ప్రసక్తిసమయమున "నీచక్రముచే నేను చావగోరుచున్నా" నని జాంబవంతుడు కృష్ణునినడగ కృష్ణు డట్లే యాతని జంపెనని విష్ణుపురాణము నుడువుచున్నది. ఈతడు కల్పాంతమువరకు మృత్యురహితుడని చాలా పురాణములు నుడువుచున్నవి. రామాయణము కలియుగప్రాప్తివరకు జీవించుమని రామునిచే దీవింపజేసినది. పై రామాయణ వచనము ననుసరించి యాతని జీవితాశ మనకులేదు. ఇట్టి యమా

నుష చర్యలవలననే జాంబవతీ వివాహము కల్పిత మనుట తగి యున్నది. సత్రాజిత్తు కూతురు సత్యభామ. ఈమె రూప వతి. కావుననే కృష్ణుని లోబరచుకొని తన్నులు కూడ ప్రసాదించినది. చూడుడు. హరివంశము. పారిజాతహరణ ఘట్టము. ఈమెకు నిత్యయౌవనత్వమును ప్రసాదించినది పదు నాల్గధ్యాయములతో ప్రక్షిప్తముచేసి మహాభారతము. ఈమెను వివాహమాడుటకు శతధన్వుడు, అక్రూరుడు, కృత వర్మయు బేరములు సాగించుచుండగ స్యమంతకమణి నెపమున గృష్ణునికి వివాహము చేయబడిన దీమె. ఆద్వేషముచే శత ధన్వుని ప్రేరేచి కృష్ణుడు వారణావతమునకు వెళ్లిన యదనున అక్రూర కృతవర్మలు సత్రాజిత్తును జంపించిరి. చూ. విష్ణు పురాణము. అక్రూరుడు కృష్ణుని మధురానగరికి గొంపోవు నప్పటికే కృష్ణునియందు గౌరవము నెక్కువగ గల్పించుకొనిన యక్రూరుడు తన కీయదలచిన కన్యను కృష్ణుని కిచ్చెనను ద్వేష ముచే సత్రాజిత్తును జంపెననుట తగినట్లు లేదు. సత్రాజిత్తు కూతులగు వ్రతిని, ప్రస్వాపిని యను నిరువురు కన్యల గూడ సత్యభామతో నొసగి వివాహముచేసినట్లు విష్ణుపురాణము నుడువుచున్నది. విష్ణుపురాణము పంచమాంశమున 5 వ అధ్యాయములో గృష్ణునికి రుక్మిణి కాక కొందరు భార్యలున్నట్లు వ్రాయబడినది. అటనే 20 వ అధ్యాయములో కృష్ణుని భార్యలు, మిత్రవింద, కాళింది, నాగ్నజితి యైన సత్య (ఈమెనే నీలాసుందరిగ గొన్నికథలు చెప్పుచున్నవి. చూ=

నీలాసుందరీ పరిణయము) జాంబవతి, మాద్రి, సుశీల, సత్రా జిత్కన్య సత్యభామ, లక్ష్మణ, రోహిణి, రుక్మిణి, అని పదుగురు చెప్పబడిరి. ఇందులో రోహిణీ, జాంబవతులు వేరుగనున్నారు. ఇక్కడనే కృష్ణుని సంతానమును గురించి చెప్పుచు సత్యభామ, రుక్మిణి, రోహిణి, నాగ్నజితి, శైబ్య, మాద్రి, లక్ష్మణ, కాళింది, మిత్రవిందలను చెప్పుటచే, తొమ్మిది సంఖ్యనే పూరించెను. విష్ణుపురాణము 4 వ అంశము 15 వ అధ్యాయములో అందరపేర్లను చెప్పక రుక్మిణి, సత్యభామ జాంబవతి, జాలహాసిని, మొదలగు 8 గురు భార్యలు కలరని వ్రాయబడెను. ఇందులో జాలహాసిని యను క్రొత్తపేరు వినబడుచున్నది. పై పేర్లలో శైబ్యకన్పడుచున్నది. ఇట్లు సందర్భశూన్యముగ నందందు చెప్పుచు కృష్ణుని సంతానము ఒకలక్షా యేబదివేలుగ జెప్పెను. భారతము కృష్ణపుత్రులు 161080 అనుచున్నది. కృతయుగమునను త్రేతాయుగమునను వేలకొలదిగ సంతానము కలుగుట పురాణములో వినుచుందుము. ద్వాపర యుగాంతరమున నూటముప్పది వత్సరములు మాత్రమే వయస్సుకల కృష్ణుడు విశేషముగ సంతానమును గనెననుట విపరీతముకదా ? హరివంశ మింతకంటె విపరీతధోరణిని నడచినది. హరివంశము పదునైదవ అధ్యాయములో, కాళింది, మిత్రవింద, సత్య, జాంబవతి, రోహిణి, మాద్రిసుశీల, సత్రా జిత్కన్యసత్యభామ, జాలహాసినియైన లక్ష్మణ, శైబ్య, అని రుక్మిణికాక తొమ్మిదిమంది చెప్పబడిరి. ఇక్కడ రోహిణివేరు

జాంబవతి వేరుగనున్నారు. లక్ష్మణ జాలహాసినియైనది. 10వ
అధ్యాయములో రుక్మిణి సత్యభామ, సుదంత, నాగ్నజితి,
శైబ్య, లక్ష్మణాజాలహాసిని, మిత్రవింద, కాళింది, జాంబవతి,
సుభీమ, మాద్రి అని పదకొండుగురు చెప్పబడిరి. భాగవతము
10 స్కంధము 33 అ 5 శ్లోకము.

హే వైదర్భ్య, చ్యుతే భద్రే,। హే జాంబవతి, కౌసల్యే,
హే సత్యభామే, కాళింది,। శైబ్యే, రోహిణి, లక్ష్మణే॥ అని
యున్నది. 77 అధ్యాయము 41 శ్లోకములో శైబ్య కనబడును.
91 అధ్యాయములో అష్టౌమహిష్యః, అని ప్రారంభమొనర్చి
చెప్పుటలో తొమ్మిది సంఖ్యను చెప్పెను. అందరు మహిషులే,
అక్కడనే కృష్ణుని పుత్రులకు నామకరణోత్సవము చేయుచు
"సుదేవ, ఉపాసంగ, కౌశికి, సుతసోమ. సుబాధిష్ఠిర, ప్రతిని,
ప్రస్వాపినుల జెప్పెను. బ్రహ్మవైవర్తములో "రాధ తులసి,
బృంద అను ముగ్గురు వెలసిరి. రాధా వృత్తాంతము త్రో
హిందూస్థానమున బహువ్యాప్తమైనదివల్లభాచార్య, లీలా
శుకజయదేవులవలననే! — మహాభారతమున సైన్యమునతి,
గాంధారి అనునిరువురు కృష్ణభార్యలు కనబడుచున్నారు. క్ర
కృష్ణునికి గళత్రవృద్ధియగుచు వచ్చినది. = మత్స్యపురాణము
47 అధ్యాయము.

రుక్మిణీ[1]సత్యభామా[2]చ సత్యా[3]నాగ్నజితీ[4]తథా
సుధామా[5]చతథా శైబ్యా[6]గాంధారీ[7]లక్ష్మణా[8]తథా

[9] మిత్రవిందాచ [10] కాళిందీ [11] దవా [12] జాంబవతీతథా
[13] సుభీమాచతథా [14] మాద్రీ [15] కౌసల్యాసుదతీ తథా॥

అని పదునైదుగురుభార్యలు చెప్పబడిరి. ఇందులోని తథాలుగూడ భార్యలందురేమో! నిఃప్రక్షిప్తవాదులు. వీరిలో దవా, సుధామా, సుభీమాలు క్రొత్తకాపురపు పేరటాండ్రు. సత్యయు, సత్యభామయు వేఱుగగన్పడుచున్నారు. రెండు మూడుచోట్లసత్యభామయే సత్యగ వాడబడుచుండుట కనుచున్నాము. ఈమత్స్యపురాణమున హస్తమునుజొనిపినయాతడు సంస్కృతభాషను నేర్చుకొనుచుండిన కవిమాత్రుడు. నాలుగు పాదములకు ఆరుతథాలున్నవి. ఒకపాదముననే రెండేసితథాలున్నవి. "ఆషాఢశుద్ధపంచమ్యాంవచ్చునే వృద్ధగౌతమీ, అథవాతప్పిజారేణ దశమ్యామిహతప్పదు." జాతిలోనిపండిత కవియై యుండవచ్చును. ఇట్టిపురాణరచయితలనే వెతకుచుందురు పౌరాణిక ప్రవరులు. పాఠకులార! ఇప్పటికి కృష్ణుని జాతకచక్రమున కళత్రస్థానము శుక్రదృష్టిప్రసారవిశేషమున యిరువదిఅయిదుగురను సంపాదించుకొనినది. భారతకథిత గాంధారీహైమవతులు, కృష్ణునితో సహగమనముజేసిరనియున్న మౌసలపర్వభాగము పక్షిప్తమని పలువురెంచుట నిదివరకు చూపియున్నాను. వీరు భారత కల్పితలు. కావునతొలంగించ వచ్చును. హరివంశము విష్ణుపురాణముకంటె యెనమండుగురు భార్యలను పెంచినది. వారు తగ్గించబడవలసినవారే కావున

ఇప్పటికి పదిమందితగ్గిన 15 గురుండెదరు. బ్రహ్మవైవర్తరచ
నము నూతనపక్షిలో నడచుచుండుటను, అలౌకికవిషయముల
నస్వాభావికములునయిన విషయముల పలురకముల దనయంది
మిడ్చుకొనుటచే నవీనత్వము దృఢపడి రాధా, బృందా, తుల
సులు తగ్గించుకొనవలసినట్లుండుటచేత పన్నిద్దరేర్పడుచున్నారు.
విష్ణుపురాణ హరివంశములు, రోహిణి జాంబవతిగజెప్పుటచే
వెనుక నేనుజెప్పినహేతువువలన నొకతెతగ్గగ పదునొకండయిరి.
"సత్యే! మమైవావమానా" అని పారిజాతాపహరణఘట్టమున
భాగవతమునను — "సత్యే! యథాత్వమిత్యుక్తం — త్వయా
కృష్ణాసప్రత్ప్రియమ్" అని పద్మపురాణమునను నుడువబడి
యుండుటచే ఒకతెతగ్గగ పదుగురైరి. బ్రహ్మపురాణము ౬౨
అధ్యాయములో రుక్మిణిగాక యేడ్గురుభార్యలజెప్పి సంతానము
నుజెప్పుటలో బొరపడి తొమ్మిదిమందినిజెప్పెను. ఒకదాని కొక
దానికిబోలికయేలేదు. మాద్రి సుశీలనుజాతము. భాగవతము
ననేకాక ఇతరపురాణములలో గొన్నిట నీమె పేరున్నది.
లక్ష్మణా, నాగ్నజితలుగూడ మాద్రకన్యలని పద్మపురాణ
ముచెప్పుచున్నది. నకులసహదేవుల మేనమామ మద్రరాజు
శల్యుడు భారతమున కన్పడుచున్నాడు. భాగవతమందు కురు
క్షేత్రమునగృష్ణునితో నీతనికలయికకలదు. శల్యుడును కృష్ణుడు
మహాభారతయుద్ధములో పలుమారులు కలిసికొన్నారు. కృష్ణు
నికి మద్రరాజుమామఅనికాని బావయనికాని చెప్పినట్లుకనము.

నకులుడు సహదేవుడును కృష్ణునిమేనత్తకుమారులు. శల్యుని కుమార్తె సహదేవునిభార్య — బావయొక్క వదినయో మరదలో కృష్ణునికి చెల్లెలువరుసలోనుండునుకదా. కావుననేకృష్ణుడామెను బెండ్లాడు నవకాశములేదు. అర్జునవాసుదేవుల జంపుమని శల్యుడు కర్ణుని బ్రేరేపించును. కర్ణశల్యులను చంపుమని కృష్ణుడనును. రథికులన్యోన్యము మత్సరముతో చంపుకొనుచుండుటయుక్తమే. సారథులయిన కృష్ణశల్యులు తామన్యోన్యము చంపుకొను యత్నములోనుందురు. ఇట్టిది యీ కర్ణశల్యబాంధవ్యము ? బృహత్సేనుడనురాజుకుమార్తె లక్ష్మణయని భాగవతవిష్ణుపురాణములు చెప్పుచున్నవి. ఈతడు కృష్ణుని కాలమున లేడు. మద్రవంశములో నీపేరుకలరాజు కృష్ణునికి మూడుతరములవెనుకనున్నాడు. ఈసమాలోచనమువలన మాద్రకన్యలు మూవురుతగ్గగ యేడుగురున్నారు. కాళిందినిజాతము. ఈమె విష్ణుపురాణమునను హరివంశమునను గనుపించుచున్నది. భాగవతమున నీమె ప్రాధాన్యముకనుపించదు. భారతమున నీమె ప్రసక్తిలేదు. కౌసల్య, విజయ, దవా, సుసీమా, సుధామా, సుభీమా, జాలహాసినీ, శైబ్యలు వ్యర్థోపన్యాసకల్పితలుగా నిజ్ఞులెంచుటకు బురాణాంతములు సాధనములుగనున్నవి. భాగవతముననున్న భార్యలలో సత్యభామ, రుక్మిణి, మిత్రమిందలు మనదృష్టినాకర్షించుచు మిగిలియున్నారు. సత్యభామ కార్యరంగమున పలుమారుకనిపించును. ఈమెనరకునిపై యుద్ధమునకు

గవిసెనని తెలుగుభాగవతముననున్న కల్పనము పద్మపురాణము లోనిది. పోతనవర్ణనాచమత్కృతికి గ్రహించినాడు. నరకునికథ కల్పితమని యిదివరకే చూపించితిని. భారతమున నీమె యూన సంధిపర్వమున గన్పడును. యుద్ధాలోచనములలో నీమెను బాల్గొనచేయవలసినప్రసక్తియుండదుకదా. భారతమునద్రౌప దితో నీమె సంభాషించినభాగము వనపర్వమునకలదు. ఇది పతివ్రతామహాత్మ్య బోధకమగు నుపన్యాసముకొరకుమాత్రమే యగుచున్నది. ఈమె సంతానము రుక్మిణీ సంతానమువలె నేవిధముగను గార్హ్యరంగమున సంచరించలేదు. కృష్ణునియం దత్యనురక్తయు కావుననే నిత్యానపాయిని యనియు దోపింప జేయుట కీప్రవేశములు కల్పింపబడియున్నవి. నిత్యయౌవన ప్రదర్శనములగు పదునాల్గధ్యాయములు భారతప్రక్షిప్తము లగుట నిదివరకుజూపించియుంటిని. ఇంతటిఅసహ్య నిత్యరతి క్రీడారక్తి నీ సత్యభామకు గల్పించి కృత్రిమప్రేమకలదిగా నామెను చిత్రించినారు పురాణకర్తలు. కృష్ణునియందత్యను రక్తగాగనుబడుచుండిన ఈమెకృష్ణునితో సహగమనముచేయు టకు సాహసించలేదు.—“ సత్యభామాతథై వాన్యాః దేవ్యఃకృష్ణ స్య సమ్మతాః ” మౌసల 6 అ. 73 శ్లో—భాగవతములో నీప్రకరణ మిద్దానిని ప్రక్షిప్తభాగము కాదని తోపింపజేయు చున్నది. స్యమంతకహరణప్రస్తావమున నీమె శౌర్యవిజితయగు వివాహితభార్యగ నంగీకరింపవచ్చును. రుక్మిణీమిత్రవిందల విష యముముందు వ్రాయబోవు నావాక్యములలో కనెదరుకాక.

## సింహావలోకనము

పాఠక మహాశయులార? నా వాదమునకు వ్యతిరే కించిన వాని నెల్లను ప్రక్షిప్తములని త్రోసిపుచ్చి పురాణముల యస్తిత్వమును నశింపు జేయుట కీ పనిని నేను పూనుకొనలేదు. పురాణములు విజ్ఞాన విషయబోధ కేర్పడి సత్యధర్మ జ్ఞానాభివృద్ధి నొందించునవి. కావున బూర్తిగ ద్రోసివైచుట మన ధర్మము కాదని నే నొప్పుకొనుచునే యున్నాను. ప్రక్షిప్త భాగము లందందు ప్రవేశించి నిజమును మరుగుపరచిన వగుటచే నేకవాక్యత తొలగిపోయిన దనునదియే నా మతము. ఈ అనర్థమును చింతించి తగిన ప్రతిక్రియను జరిగించుటకు బండితులు పూనుకొనవలసి యున్నది. పురాణశ్రేణి ఏకవాక్యతయు సందర్భశుద్ధియు లేని పద్ధతిలో దృశ్యమాన మగుచుండుటచే నేనింతగ విమర్శించితిని. సమర్థించుట కవకాశము చాలనపు డెల్లను విధిచర్య అడ్డుపడుచుండు నీ పద్ధతిని దూరముగ నుంచి విధిని సరిగ నిర్వర్తించుట తగునుకదా? ధర్మము ధర్మమంచు జీర్ణించి గడ్డగట్టిన ఈ సాంప్రదాయ పుష్టిని వేదాంతవేత్త లెంతవర కాశ్రయించి పెంచుకొని బలియుదురో అంతవరకు మన మానవత్వము పశుత్వముగనే తలచుట శ్రేయము. నిండు సభలను గూర్చుకొనుచు ధర్మవివక్షనుపన్యసించు పండితు లీ కృష్ణుని మూలమున స్త్రీలోకము నెల్లు

మానరహితలను చేసిరో? నేటి నాగరిక స్త్రీజాతి తెలిసికొనలేకపోవుట చిత్రముగ నున్నది.

ఆర్యమత పవిత్ర చిహ్నముగ, ఆదర్శపురుషుడుగ, నెన్నుకొన దగిన మహానుభావుని కృష్ణుని జీవితమును భారత సాంప్రదాయ మెఱచు ప్రవర్తనము కలవానిగ చిత్రించుట విచారణీయము కదా? మహాశయులార? ప్రస్తుత పరిస్థితుల ననుసరించిన కొలబద్దలతో కృష్ణ వివాహములను నేను కొలుచుటకు యత్నించ లేదనియు తత్కాలపు పరిస్థితులను దత్కాల విషయ బృంహిత గ్రంథములను గమనించియే నేనీ రచనకు దిగితిననియు మనవి చేసికొనుచున్నాను. కృష్ణుని యందత్యనురక్త యగు రుక్మిణీ వివాహమును, స్యమంతకమణి సంపాదనముగ గౌరవదత్త యగు సత్యభామా వివాహమును మేనయత్త కుమార్తె (బంధువులలో ముఖ్యులు) విందానువిందుల సోదరి, కృష్ణుని లౌకికసామర్థ్యము నెరిగినది. స్వయమూహాయదత్త, "(మిత్రవిందా ఉవాచ) పితామే మాతులే యాయ స్వయమూహాయ దత్తవాన్, కృష్ణే! కృష్ణాయ తచ్చిత్తా మక్షౌహిణ్యా సఖీజనైః॥ భాగ - ద. ౩. శ్లో॥" యనగు మిత్రవిందా వివాహమును శాస్త్రసమ్మతములై పందరోచితములై యుండుటచే జరిగియుండునని నేనభిప్రాయపడితిని. ఔచితీయుతములైన యిట్టి వివాహములు నాడును నేడును గూడ జరుగుటలో మనము వింతపడవలసినది లేదు.

ఈ విమర్శనములవలన లోకులకు నే నందించు సందేశ మేమియు లేకున్నను మనదేశీయ పండితులును ఇతరదేశీయ పండితులును వేని ననుకరించి నమ్మి పొరపడుచున్నారో వానిని చూపుట జరిగిన దను మనస్తృప్తియే. నాకు కలిగిన ఈ సంశయముల నివారించుటకు పండితులు పూనుకొని నావాద లోపములను జూపినచో సవరించుకొనని మూఢత్వ మొందనని వినయ పూర్వకముగ మనవి నొనర్చుకొనుచు నింతటితో నీ విషయ ములను జదువరుల సమక్షమున నుంచి విరమించుచున్నాను.

వేగేశ్వరపురం
పశ్చిమగోదావరిజిల్లా
4-3-1958

బుధజనవిధేయుడు
యేలూరుపాటి రామభద్రచయనులు
నేను

